

# మాయ వర్తకుడు

ఒకప్పుడు కైరోనగరంలో మారుఫ్ అని ఒక యువకుడుండే వాడు. అతను అతి పేదవాడు, న్యాయమైనవాడు. అతను పాత చెప్పులు మరమ్మతు చేసి జీవించేవాడు.

అతనికి ఫాతిమా అనే భార్య ఉండేది. ఆమె పరమ గయ్యాళి. ఆమె ఎప్పుడూ కోపంతో రుసరుసలాడుతూ ఉండేది. దానికి తగ్గట్టు ఆమె నోరుకూడా మహచెడ్డది. ఆమె తన భర్తను సుఖపెట్టలేకపోగా అస్తమానం తిట్టి శాపనార్థాలు పెడుతూ, అతనికి జీవితం పైన రోత పుట్టేటట్టు చేస్తూండేది.

మారుఫ్‌కు సుఖంగా బతకాలన్న కోరిక జాస్తిగా ఉండేది. విధిన పడటమంటే అతనికి చాలాభయం. అందుచేత తాను సంపాదించిన డబ్బులన్నీ తన భార్యకోసమే వినియోగిస్తూ వచ్చేవాడు. కాని ఏనాడైనా కర్మం చాలక అతను డబ్బు తీసుకురాకుండా ఇంటికి వస్తే ఆమె తెల్లవార్లూ శాపనార్థాలు పెట్టి, అతనికి కొంచెమైనా మనశ్శాంతి లేకుండా చేసేది.

ఒకనాడు ఫాతిమా తన భర్తతో, "ఇవాళ సాయంకాలం ఇంటికి వచ్చేటప్పుడు, బాగా ఇంత తేనె వేయించి తీపిరొట్టె పట్టుకురా," అన్నది. "అల్లా అనుగ్రహించి నాలుగు డబ్బులు వచ్చేటట్టు చేస్తే అలాగే తెస్తాను! ప్రస్తుతానికి నాదగ్గిర చిల్లిగవ్వకూడా లేదు," అన్నాడు మారుఫ్.

"అల్లా అనుగ్రహించేదేమిటి? ఈ రాత్రికి నాకు తేనెలో ఉడ్చిన తీపిరొట్టె లేకపోయిందో నీకు మూడిందనుకో!" అన్నది గయ్యాళిది.

తనకు నాలుగు డబ్బులు వచ్చేటట్టు చెయ్యమని అల్లాను ప్రార్థిస్తూ మారుఫ్ తన దుకాణానికి వెళ్ళాడు. కాని, ఎవరో పరికి పెట్టినట్టు, ఆ రోజు అతను ఒక చిన్న రాగి డబ్బుకూడా సంపాదించలేక పోయాడు.

ఎ. నారాయణశర్మ





పట్టుకుని వెళ్ళు. డబ్బు తరవాత ఇద్దువు గాని!" అంటూ దుకాణదారు తీపిరొట్టె ఒకటి తీశాడు. కాని దానిమీద పొయ్యటానికి అతనివద్ద సమయానికి తేనె లేదు. "తేనెకు బదులు చక్కెరపాకం వేస్తాను. రెండూ ఒకటే రుచి. మా దుకాణంలో సరుకు కొనేవారు రెంటినీ ఒకటిగానే భావిస్తారు," అంటూ దుకాణదారు రొట్టెమీద బాగా చక్కెరపాకం పోశాడు.

మారుఫ్ దుకాణదారుకు తన కృతజ్ఞత తెలుపుకుని, ఆ తీపిరొట్టెను ఇంటికి తీసుకు వెళ్ళాడు. అతన్ని చూస్తూనే ఫాతిమా, "రొట్టె తెచ్చావా, లేదా?" అని అడిగింది. ఆమె రొట్టెను చూసి సంతోషించకపోగా గొంతు చించుకుంటూ, "రొట్టెమీద తేనె పోయించుకుని తెమ్మని చెప్పితే చక్కెర పాకం ఎందుకు పోయించావు? నాకు తేడా తెలియదనుకున్నావా?" అని అరిచింది.

"నీకు పుణ్యం వుంటుంది, ఈ సారికి ఇలాగే తినేద్దూ! ఇది కొన్నదికూడా కాదు. దుకాణదారు అరువిచ్చాడు. అతనిదగ్గిర తేనె లేదు. ఏం చెయ్యను?" అన్నాడు భర్త హతాశుడై.

"నాకేమీ అక్కర్లేదు," అంటూ ఆమె ఆ రొట్టెను భర్త ముఖాన గిరవాటువేసింది.

ఆఖరుకు తిండి రొట్టె కొనుక్కుని ఇంటికి పోవటానికికూడా అతనివద్ద డబ్బు లేదు.

నిరాశా నిస్పృహలతో కుంగిపోయి అతను ఇంటికి తిరిగి వస్తూండగా దారిలో మిఠాయి దుకాణం తగిలింది. అతను కంట నీరు కారుస్తూ దుకాణం బయట నిలబడి, లోపల ఉన్న రకరకాల తీపిరొట్టెలకేసి చూడ సాగాడు. దుకాణదారు అతన్ని గమనించి, లోపలికి పిలిచి, "ఎందుకు విచారంగా ఉన్నావు?" అని అడిగాడు. మారుఫ్ తన గోడవంతా చెప్పుకున్నాడు.

"ఈమాత్రానికే కొంప మునిగిపోలేదులే. నీ భార్యకు కావలసిన సరుకు నేనిస్తాను,



"ఛీ, నాకు తేనెరొట్టె పట్టుకురా!" అంటూ దవడమీద గట్టిగా కొట్టింది. ఆ దెబ్బకు మారుఫ్ పళ్ళ పన్నొకటి విరిగి, నోటివెంట రక్తం కారసాగింది.

ఉన్న ఓర్పు కాస్తా పోయి మారుఫ్ తన భార్య నెత్తిన చిన్న మొట్టికాయ వేశాడు. వెంటనే ఫాతిమా అమ్మకశ్త్తిలాగా అయి పోయి, తన భర్త మెడ గట్టిగా పట్టుకుని గుంజుతూ, "ఎవరర్రోయ్! రండి, రండి! నా మొగుడు నన్ను చంపేస్తున్నాడు!" అని పెడబొబ్బలు పెట్టింది.

ఈ పొలికేకలు విని ఇరుగు పొరుగు వాళ్ళు వచ్చి మారుఫ్‌ను అతని భార్య పట్టునుండి విడిపించారు. జరిగినదంతా విని వాళ్ళు ఆ గయ్యాళితో, "చక్కెర పాకం వేసిన రొట్టెకేం లోపం వచ్చింది? మేమంతా తింటున్నాము కామా? అనవసరంగా ఆ నిర్భాగ్యుణ్ణి ఎందుకు వేధిస్తు తింటున్నావు?" అన్నారు.

వాళ్ళంతా వెళ్ళిపోయాక మారుఫ్ రొట్టె ముక్కలన్నిటినీ ఏరి, కొంచెం రుచి చూడమని తన భార్యను బతిమాలాడు, కాని లాభం లేకపోయింది. కడుపు దహించుకు పోతూండటంచేత చివరకు వాటిని తానే తినసాగాడు.



తెల్లవార్లూ భార్యచేత తిట్లు తిని మారుఫ్ మర్నాడు ఉదయమే లేచి మసీదుకు వెళ్ళి, తన కష్టాలు కడతేర్చమని అల్లాను ప్రార్థించి, అక్కడినుంచి సరాసరి తన దుకాణానికి చేరుకున్నాడు.

అతను దుకాణంలో కూర్చున్నాడో లేదో, ఇద్దరు భటులు వచ్చి, "నిన్ను కాజీగారు పట్టుకురమ్మన్నారు, పద," అంటూ అతన్ని లాక్కుపోయారు. న్యాయస్థానంలో కాజీ ఉన్నాడు, అతని ఎదురుగా ఫాతిమా తల వంచుకు నిలబడి ఉన్నది. ఆమె చేతికి కట్టూ, ముఖం మీద బాగా రక్తం మరకలు గల ముసుగూ ఉన్నాయి.

కాజీ మారుఫ్‌ను చూస్తూనే, "పాపీ, నీకు అల్లా భయం కొంచెంకూడా లేదా? ఈ ఆడకూతుని చెయ్యి విరగగొడతావా? పన్ను రాలగొడతావా?" అని పెద్దగా గదమాయించాడు.

క్షణంపాటు చెప్పులు కుట్టేవాడికి మతి పోయినట్టయింది. అతను కాజీగారికి వాస్తవం నివేదించుకున్నాడు. కాజీకి అతని మాటలలో నమ్మకం కుదిరింది. ఆయన ఒక పావు దీనారం తీసి అతని కిస్తూ, "ఇది పెట్టి నీ భార్యకు తేనెరొట్టె కొనిపెట్టు! ఇద్దరూ మరెన్నడూ కీచులాడుకోకండి, పదండి!" అన్నాడు.

మారుఫ్ ఆ డబ్బును భార్య చేతుల్లో పెట్టేసి తన దుకాణానికి వెళ్ళాడు. కొద్ది సేపటికల్లా భటులు వచ్చి, "నిన్ను న్యాయ స్థానానికి తీసుకు పోయినందుకు మాకు భత్యండబ్బులు ఇయ్యి!" అని అడిగారు. ఏం చెయ్యాలో తోచక అతను తన పని ముట్లన్నీ అమ్మి భత్యాలు ఇచ్చేశాడు.

దుకాణం ఖాళీ అయింది. తనకు పట్టిన దుస్థితినిగురించి ఆలోచిస్తూ అతను విచార సాగరంలో మునిగివుండగా ఇంకొక న్యాయ స్థానానికి చెందిన భటులు మరి ఇద్దరు వచ్చి, "కాజీగారు నిన్ను పట్టుకురమ్మన్నారు!" అని చెప్పారు.





అతను వారివెంట వెళ్ళి ఈ న్యాయ స్థానంలో మళ్ళీ తన భార్య పూర్వంలాగే తనమీద అక్రమంగా ఫిర్యాదు చేయటం గమనించాడు. అతను ఈ రెండో కాజీకి జరిగినదంతా చెప్పి, "ఒక గంటక్రితం మా తగాదాకు ఒక కాజీగారు తీర్పు అవ్వటం అయింది," అన్నాడు. కాజీగారు ఫాతిమాను కొప్పడి, "గంటక్రింద తీర్పు ఇచ్చిన ఫిర్యాదు మళ్ళీ ఏమని తెచ్చావు?" అన్నాడు.

"హుజూర్, నా మొగుడు నన్ను మళ్ళీ కొట్టాడు!" అన్నది ఫాతిమా.

కాజీ ఆమెను మందలించి, భటులకు భత్యాలు చెల్లించమని మారుఫ్‌తో చెప్పాడు. దాంతో మారుఫ్ జేబులు ఖాళీ అయాయి. అతను మరింత కుంగిపోయి తన దుకాణానికి తిరిగి వెళ్ళాడు.

మరొక గంటకల్లా కొందరు మిత్రులు అతని దుకాణానికి పరిగెత్తుకుంటూ వచ్చి, "మారుఫ్, కొంప మునిగింది! నీ భార్య మహేదారు కచేరీలో నీమీద ఫిర్యాదుచేసింది. వెంటనే పరారీఅయిపో!" అని చెప్పారు.

మారుఫ్ వెంటనే లేచి దుకాణం మూసి, సాధ్యమైనంత త్వరలో కైరోనగరం దాటి పారిపోయాడు. అసలె చలికాలం. దానికి తోడు వర్షం ఆరంభమయింది. వానకు తడుస్తూ, చలికి వణుకుతూ అతను చీకటి



పడినదాకా నడిచి ఒక పాడుబడిన భవనాన్ని చేరుకుని అందులో ఆ రాత్రి తల దాచుకున్నాడు.

తన స్థితి తలుచుకున్న కొద్దీ అతనికి ఏడుపు వచ్చింది. కట్టుకున్న భార్య తనకు ఇల్లూ వాకిలీ లేకుండా చేసింది. భవిష్యత్తు చూడబోతే అయోమయంగా ఉంది. అందుచేత అతను పెద్దపెట్టున ఏడవసాగాడు.

ఇంతలోనే ఎవరో, "ఎందుకు నాయనా, అంత దుఃఖిస్తున్నావు?" అని అడగటం మారుఫ్‌కు వినిపించింది.

మారుఫ్ తల ఎత్తి ఒక వింత ఆకారాన్ని చూసి, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"నేను నూరేళ్లుగా ఈ పాడుపడిన ఇంటిని ఆశ్రయించి ఉన్న భూతాన్ని, నావల్ల నీకేమైనా సహాయం కావాలంటే చెప్పు. ఇవాళ నువ్వు నా అతిథివి!" అన్నది భూతం.

"బాబూ, నీకు చేతనైతే నన్ను ఈ కైరో నగరానికి వీలయినంత దూరంగా చేర్చు. నా జీవితమంతా ధ్వంసమయింది. కొత్త చోట మళ్లా కొత్త జీవితం ఏర్పరుచుకుంటాను!" అన్నాడు మారుఫ్.

"నా వీపుమీద ఎక్కి కూచో!" అన్నది భూతం. అతను అలాగే చేశాడు.

కన్నుమూసి కన్నుతెరిచేసరికి మారుఫ్ ఒక పర్వత శిఖరంమీద ఉన్నాడు. తూర్పు తెల్లవారుతున్నది. పర్వతానికి దిగువున ఒక బ్రహ్మాండమైన నగరం కానవస్తున్నది.

మారుఫ్ గబాగబా కొండ దిగి ఆ నగరం చేరుకున్నాడు. అక్కడి ప్రజలు అతనికి కొత్తగా కనిపించారు. వారు అతని దుస్తులకేసి వింతగా చూసి, అతని చుట్టూ మూగి, "నీ పేరేమిటి? మీది ఏ దేశం?" అని అడగసాగారు.

"నాపేరు మారుఫ్. మాది కైరోనగరం," అని అతను జవాబిచ్చాడు.

"నువ్వు కైరోనుంచి బయలుదేరి ఎంత కాలమయింది?" అని వారు మళ్లీ అడిగారు.



"నిన్న సాయంకాలం బయలుదేరాను," అన్నాడు మారుఫ్. అందరూ గొల్లున నవ్వారు. ఒక పెద్దమనిషి అతనితో, "నీకేమైనా మతిపోయిందా ఏమిటి? కైరోనుండి ఈ ఖితాన్ నగరానికి ఒక ఏడాది ప్రయాణం. నువ్వు నిన్న సాయంకాలం బయలుదేరటమేమిటి? అప్పుడే రావటమేమిటి? చాలు, చాల్లె!" అన్నాడు.

"నేను నడిచి రాలేదు. ఒక భూతం నన్ను తన వీపున ఎక్కించుకుని తెచ్చి ఇక్కడ వదిలింది!" అన్నాడు మారుఫ్.

ఈ మాటకు చుట్టూ మూగిన జనం మరింతగా విరగబడి నవ్వారు. "పిచ్చివాడు!" అంటూ అందరూ అతనిమీద విరుచుకుపడ్డారు.

సరిగా ఆ సమయానికి అక్కడికి ఒక పెద్దమనిషి దేవుడల్లే వచ్చాడు. ఆయన ఆ నగరంలోని గొప్ప వర్తకులలో ఒకడు. "ఎవరో పరాయిదేశంవాణ్ణి పట్టుకుని ఇలా అల్లరిపెట్టవచ్చునా? మీరంతా ఏం పని చేస్తున్నారు?" అంటూ ఆయన అక్కడి జనాన్ని మందలిస్తూ, వారి మధ్యగా మారుఫ్ వద్దకు చేరుకున్నాడు. ఆయన అతన్ని తన యింటికి అతిథిగా ఆహ్వానించి ఎంతో గౌరవంగా తీసుకు వెళ్లాడు.

మారుఫ్ స్నానంచేసి, తానిచ్చిన ఖరీదైన దుస్తులు ధరించి, సుష్టుగా భోజనంచేసి కూచున్నాక, వర్తకుడు అతనితో, "అయ్యా మీ దుస్తులు చూస్తే ఈజిప్టునుంచి వచ్చినట్టు కనిపిస్తున్నారు. అసలు మీదే దేశం?" అని అడిగాడు.

"చిత్తం, నేను ఈజిప్టు దేశస్తుడినే. కైరో నగరంలోనే నా నివాసం" అన్నాడు మారుఫ్.

"అక్కడ ఏంచేసేవారు?" అని వర్తకుడు అడిగాడు.

"పాతచెప్పులు మరమ్మతు చేసేవాణ్ణి!" అన్నాడు మారుఫ్.

"కైరోలో మీ ఇల్లెక్కడ?" అని వర్తకుడు మళ్లీ అడిగాడు.

"ఎర్రసందులో," అని మారుఫ్ వెంటనే జవాబిచ్చాడు.

"ఆ సందులో ఉండేవారెవరైనా తెలుసా?" అన్నాడు వర్తకుడు. మారుఫ్ కొందరి పేర్లు చెప్పాడు.

"షేక్ అహ్మద్ అనే అత్తరు వ్యాపారి తెలుసా?" అని అడిగాడు వర్తకుడు.

"నాకు తెలియకపోవట మేమిటి? మావి పక్క పక్క ఇళ్లే!" అన్నాడు మారుఫ్ బిగ్గరగా నవ్వుతూ.

"ఆయన ఎలా ఉన్నారు?"

"అల్లా దయవల్ల కులాసాగానే ఉన్నారు." అన్నాడు మారుఫ్.

"ఆయన కిప్పుడెంతమంది కుమారులు?"

"ముస్తఫా, మహమ్మద్, అలీ అని ఆయనకు ముగ్గురు కుమారులు."

"వారేమేంపనులు చేసుకుంటున్నారు?"

"పెద్దవాడు ముస్తఫా బడిపంతులు. రెండోవాడు మహమ్మద్ అత్తరు వ్యాపారం లోనే ప్రవేశించి, తండ్రి దుకాణానికి పక్కనే తన దుకాణంకూడా పెట్టాడు. మూడోవాడు అలీ, నేనూ చిన్నప్పుడు కలిసి ఆడుకునే వాళ్లం. మేమిద్దరమూ క్రైస్తవుల ఆలయం లోకి జొరబడి, ప్రార్థనపుస్తకాలు దొంగి



లించి అమ్మి, ఆ డబ్బులతో మిఠాయి కొనుక్కు తినేవాళ్లం. ఒకరోజు క్రైస్తవులు మమ్మల్ని పట్టుకున్నారు. షేక్ అహ్మద్ తన కొడుకును చచ్చేటట్టు కొట్టాడు, వాడు కాస్తా పరారీ అయిపోయాడు. ఈ ఇరవై ఏళ్లుగా వాడి జాడే తెలియలేదు."

మారుఫ్ ఈ సంగతి చెప్పగానే వర్తకుడు లేచివచ్చి అతన్ని కౌగలించుకుని, "మారుఫ్, నేనే ఆ అలీని" అన్నాడు.

తరవాత మారుఫ్ తన కథ యావత్తూ స్నేహితుడికి చెప్పేశాడు. అంతా విని అలీ, "చూడు, తమ్ముడూ! నువ్వు కూటికికూడా లేని చెప్పులు కుట్టేవాడివనీ, భార్య పోరు పడలేక పారిపోయి వచ్చావనీ ఇక్కడి ప్రజలకు తెలిస్తే నిన్ను ఎవరూ ఖాతరు చెయ్యరు. నిన్న కైరోలో బయలుదేరి తెల్లారేసరికల్లా ఇక్కడికి చేరుకున్నావంటే అందరూ నవ్వుతారు. నిజం చెప్పటం నిష్ప్రయోజనమైనప్పుడు యుక్తిగా అబద్ధం చెప్పటం తెలివైన పని. నేను ఊరు చేరి ఎన్ని బొంకులు బొంకి పైకి వచ్చానో నువ్వు ఊహించలేవు," అన్నాడు.

"అయితే నన్నేం చెయ్యమంటావు?" అన్నాడు మారుఫ్.

"నేను చెబుతాను విను. రేపు ఉదయం, నా కంచరగాడిదలలో మంచిదిగా చూసి, దానిమీద వర్తకుల వీధికి రా. నీవెంట మా





ఉంటి బానిసలలో ఒకణ్ణి వెంట తీసుకురా. అక్కడ నేనూ ఇంకా పెద్ద వర్తకులూ కూచుని ఉంటాం. నేను నిన్ను చూడగానే లేచి నిలబడి ఎంతో గౌరవంగా స్వాగత మిస్తాను. కైరోనగరంలో వర్తకులందరిలోకీ గొప్పవాడివని నిన్ను ఇక్కడి వర్తకులకు పరిచయం చేస్తాను. ఎవరన్నా బిచ్చగాళ్లు వచ్చి చెయి చాస్తే ధారాళంగా దానాలు చెయ్యి, అందుకుగాను నీకు కొంత డబ్బి స్తాను. తరవాత నేను నిన్ను ఫలాని సరు కున్నదా? అని అడుగుతాను, కొల్లలుగా ఉన్నదని సమాధానమియ్యి. ఇదంతా కళ్లారా చూశాక ఇక్కడి వర్తకులు నీతో



వర్తకం చెయ్యగోరుతారు. వారి సహాయంతో నువ్వు నిజంగానే పెద్ద వర్తకుడివైపోవచ్చు. నేను అలాగే వర్తకుణ్ణి అయాను," అన్నాడు అలీ.

మర్నాడు అలీ తన స్నేహితుడికి చాలా ఖరీదైన దుస్తులూ, వెయ్యి బంగారు దీనారాలూ ఇచ్చి వర్తకుల బజారుకు వెళ్లిపోయాడు. ఆయన చెప్పిన ప్రకారమే మారుఫ్ ఒక మంచి కంచరగాడిదమీద ఎక్కి, తన వెనక ఒక బానిసవాణ్ణి నడిపించుకుంటూ వర్తకుల బజారు చేరాడు. అక్కడ అతనికి అలీతోబాటు ఖాన్‌లోని గొప్పగొప్ప వర్తకులందరూ కనిపించారు.

అతన్ని చూస్తూనే అలీ దివాలున లేచి ఎదురువెళ్లి, అతని కాళ్లు కళ్లకద్దుకుని, అతన్ని కంచరగాడిదెపైనుంచి దింపి తెచ్చి వర్తకుల మధ్య కూచోపెట్టాడు.

మిగిలిన వర్తకులు ఒక్కొక్కరే వచ్చి, రహస్యంగా అలీ చెవిలో, "వీరెవరు ?" అని అడిగారు.

"ఈజిప్టులో ఇంతకు మించిన వర్తకుడు లేడు. ఈయన తండ్రి తాతల ఐశ్వర్యాన్ని గురించి చిత్రవిచిత్రమైన కథలు చెబుతారు. దాదాపు ప్రతి మారుమూల దేశంలోనూ ఈయన తాలూకు గిడ్డంగులున్నాయి. ఈయ



నతో పోలిస్తే మనమంతా చిల్లర వ్యాపారులమే," అని అలీ వారికి తెలియచేశాడు.

ఈ మాటలు వింటూనే వర్తకులందరూ మారుఫ్ చుట్టూ మూగి, ఒకరిమీద ఒకరు పోటీపడి అతనిచేత షర్బతులు తాగించి మర్యాదచేశారు. వర్తకుల పెద్ద అతనిపక్క చేరి, "అయ్యా, తమరు పచ్చపట్టు తానులేమైనా తెచ్చారా?" అని అడిగాడు.

"కొల్లలు, కొల్లలు!" అన్నాడు మారుఫ్.

"ఎర్రవో?" అన్నాడు వర్తకుల పెద్ద.

"కొల్లలు, కొల్లలు!" అన్నాడు మారుఫ్.

మిగిలిన వర్తకులు ఏ సరుకుగురించి ప్రశ్నించినా అతను, "కొల్లలు, కొల్లలు!" అని మాత్రమే సమాధానాలిచ్చాడు.

"దయచేసి నమూనాలు చూపిస్తారా?" అని వర్తకులు అడిగారు.

"తప్పక చూపిస్తాను, సరుకు రానివ్వండి. వెయ్యి కంచరగాడిదలతో నా బిడారు కొద్ది రోజులలోనే యీ నగరం వచ్చి చేరుతుంది!" అన్నాడు మారుఫ్.

సంభాషణ ఈ విధంగా సాగుతున్న సమయంలో బిచ్చగాడొకడు వచ్చి వర్తకులకేసి చెయ్యి చాచాడు. వెంటనే మారుఫ్ తన జేబులోనుంచి గుప్పెడు బంగారు నాణాలు తీసి బిచ్చగాడి చేతుల్లో పెట్టాడు.



అది చూసి మిగిలిన వర్తకులంతా దిగ్భ్రమ చెందిపోయారు. "ఈ మనిషి రాజులకన్న ధనికుడులా ఉన్నాడు!" అని వారు తమలో తాము అనుకున్నారు.

మరి కాస్సేపటికి ఒక బిచ్చగత్తె వచ్చి చెయ్యి చాచింది. ఆమెకుకూడా మారుఫ్ గుప్పెడు బంగారం దానం చేశాడు. ఆమె మిగిలిన బిచ్చగాళ్ళకు బంగారం చూపింది. వాళ్ళంతా ఒక మందగా వచ్చారు.

తొణకక బెణకక మారుఫ్ తనదగ్గిర వున్న బంగారమంతా బిచ్చగాళ్ళకు పంచేసి, జేబు ఖాళీ అయాక, "అరె అల్లా! ఈ నగరంలో ఇంతమంది బిచ్చగాళ్లున్నారని

తెలిస్తే, ఇంకా ఎక్కువ బంగారం వెంట తెచ్చుకుని ఉండునే! పాపం, వాళ్లు దేహీ అని అడిగితే ఇవ్వకపోవటం ఎలా ?" అన్నాడు.

"అయ్యా, తమ రేమీ విచారించ కండి. తమకు అవసరానికి కావలిస్తే మేము సర్దుతాము !" అన్నారు వర్తకుల పెద్ద.

మరుక్షణమే మారుఫ్ చేతికి మరో వెయ్యి దీనారాలు అందాయి. మధ్యాహ్నం ప్రార్థనల వేళదాకా అతను వాటితో దానధర్మాలు చేస్తూ, ఇంకా మిగిలినవాటిని మసీదులో ప్రార్థనలు చేసేవారిమీద వెదజల్లేశాడు. ప్రార్థనలు ముగియగానే అతను మరొక వెయ్యి దీనారాలు అప్పు తీసుకుని వాటిని కూడా దానధర్మాలకింద పంచేశాడు. చీకటి పడే లోపుగా అతను వర్తకులవద్ద అయిదు వేల దీనారాలు అప్పుచేసి, అదంతా బీద సాదలకు దానధర్మాలు చేసేశాడు.

తన దానధర్మాలు చూసి విస్తుపోయి ఉన్న వర్తకులతో అతను, "నా బిడారు దిగనివ్వండి. మీ బాకీ బంగారం రూపంలో చెల్లించమంటే చెల్లిస్తాను, సరుకురూపంలో చెల్లించమన్నా చెల్లిస్తాను !" అన్నాడు.

ఆ రాత్రి అలీ వర్తకులకందరికీ విందు చేశాడు. ఆ విందులో మారుఫ్ ప్రధాన వ్యక్తి. అతనికి భోజనాలదగ్గిర ఉన్నతాసనం ఇచ్చారు. ఆ రాత్రల్లా అతను పట్టుతానులు గురించీ, రత్నాలను గురించీ ఏకథాటిగా మాట్లాడాడు. మధ్యమధ్య ఎవరైనా, "మీ బిడారులో ఫలాని సరుకు వస్తోందా ?" అని అడిగితే, "కొల్లలు, కొల్లలు !" అన్నాడు.

మర్నాడు మళ్ళీ అతను వర్తకుల బజారుకు వెళ్లి, వర్తకులవద్ద అప్పుచేసి బిచ్చగాళ్ళకు బంగారం దానంచేశాడు. ఇదే విధంగా ఇరవై రోజులపాటు సాగింది. అప్పటికి అతను అక్కడి వర్తకులకు అరవైవేల దీనారాలు బాకీ పడ్డాడు. అతని బిడారు జాడమాత్రం లేదు.

(వచ్చేసంచికలో ముగింపు)





# మాయ వర్తకుడు

[గత సంచిక తరువాయి]

ఇన్నాళ్ళూ ఆ బిడారుకోసం ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్న వర్తకులు తమ డబ్బు గురించి ఆదుర్దా పడనారంభించారు. వారి ఆందోళనను ఆలీకి చెప్పుతున్నారుకూడా. ఎందుకంటే అతని మాటలునమ్మే వారు మారుఫ్‌కు అప్పుపెట్టారు.

అలీ మారుఫ్‌ను అవతలికి తీసుకుపోయి, "నీకు పూర్తిగా మతి పోయినట్టుందే? వర్తకులు డబ్బుకోసం తొందర చేస్తున్నారు. నువ్వు వారికి అరవైవేలు బాకీ పడ్డావుట. ఈ సొమ్ముతో ఎంత వర్తకమైనా చేసుకుని ఉండవచ్చు. నువ్వు వట్టి సోమరిపోతులాగా దాన్ని బిచ్చగాళ్లకు పంచిపెట్టావు! ఈ బాకీ ఎలా తీర్చదామని నీ ఉద్దేశం?" అని గట్టిగా కొప్పడ్డాడు.

"ఏమీ భయంలేదు. ఈ అరవైవేల నగా ఎంత? నా బిడారు రానీ, వర్తకులకు బంగారం కావాలంటే బంగారం ఇస్తాను, సరుకు కావాలంటే సరుకిస్తాను. ఏది కావా లన్నా నాదగ్గర కొల్లలు, కొల్లలు!" అని మారుఫ్ తాపీగా జవాబిచ్చాడు.

"ఓరి పిడుగా! ఆ కట్టుకథ నాకే చెబు తున్నావా? నీ బతుకు ప్రపంచానికి ఇప్పుడే చాటగలను. జాగ్రత్త. ఏమిటనుకున్నావో!" అన్నాడు అలీ.

"చాల్లే! నేను పేదవాణ్ణనుకున్నావా? అంతులేని సంపద దారిలో ఉందనుకో. నా బిడారు దిగిన మరుక్షణం ఈ వర్తకుల సొమ్ము ఇబ్బడిగా పారేస్తాను!" అన్నాడు మారుఫ్ కొంకకుండా.

"నాతోనే అబద్ధమాడతావురా, దుర్మా ర్గుడా? చూడు ఏం చేస్తానో!" అని అలీ బెదిరించాడు.

"నువ్వేంచేసినా సరే, నా బిడారు వచ్చే దాకా ఈ వర్తకులందరూ వేచివుండ

ఎ. నారాయణశర్మ



తప్పదు. ఆ తరవాత వారి సొమ్ము వారి కిస్తాను. ఇంకా ఎక్కువే ఇస్తానుకూడా!" అన్నాడు మారుఫ్.

అంతటితో అలీ ఆట కట్టయింది. ఒకప్పుడు తాను ఈ మారుఫ్‌ను చాలా పెద్ద కోటీశ్వరుడుగా పరిచయం చేసి, ఆ నోటితోనే ఇప్పుడతను గర్భదరిద్రుడని సాటి వర్తకులతో చెప్పటం ఎలా?

మిగిలిన వర్తకులంతా అలీ దగ్గిరికి వచ్చి, "మా బాకీ సంగతి ఏమంటాడు? వ్యవహారం ఏమైనా దారిన పడేటట్టుందా?" అని ఆత్రంగా అడిగారు. అలీ నీరసంగా, "అతనితో బాకీ సంగతి నేను ప్రస్తావించటానికి జంకాను. ఎందుకంటే నేనే అతనికి వెయ్యి దీనారాలు అప్పుపెట్టి ఉన్నాను. అసలు మీరు అతనికి అప్పుపెట్టే ముందు నాతో చెప్పి ఉండవలసింది. మీ బాకీకి నేను జవాబుదారును కాను; దాన్ని మీరే వసూలు చేసుకోండి. సాధ్యం కాకపోతే సుల్తానుగారివద్దకు వెళ్ళి, అతను వంచకుడని, మిమ్మల్ని దగాచేశాడని ఫిర్యాదు చేసుకోండి!" అన్నాడు.

వర్తకులందరూ కలిసి సుల్తానుగారివద్దకు వెళ్ళి, తమకూ మారుఫ్‌కూ మధ్య నడిచిన లావాదేవీ అంతా విన్నవించుకున్నారు. "ప్రభూ, ఈ మనిషి పేదవాడనుకుందామా అంటే, మా కళ్ళ ఎదటే పేదలకు గుప్పిళ్ళతో బంగారం దానం చేశాడు. దరిద్రుడైనవాడు అలా ఎన్నడూ చేయడు. ఈ దాన ధర్మాలకోసం అతను మావద్ద అరవై వేల దీనారాలు అప్పు తీసుకున్నాడు. పోనీ అతను ధనవంతుడే అని తొందర పడకుండా ఉందామంటే, ఎన్నాళ్ళు చూసినా అతని బిడారు జాడ లేకుండా ఉంది!" అన్నారు వారు.

వారు చెప్పేది వింటూంటే సుల్తానుకు మారుఫ్ సాటిలేని ధనికుడన్న నమ్మకం కుదిరింది.



అయన అసలే లోభి. ఈ మారుఫ్ పేదలకు గుప్పిళ్ళతో బంగారం దానం చేస్తున్నాడనేసరికి, అటువంటివాడివల్ల లాభం పొందాలన్న దురాశ అయనలో తల ఎత్తింది. అయన వర్తకులను పంపేసి, తన వజీరును పిలిచి, "మనం ఈ మారుఫ్ స్నేహం సంపాదించుకోవాలి. అతని బిడారు ఇవాళ కాకపోతే రేపైనా వచ్చి తీరుతుంది. ఈ వర్తకులు గద్దలలాగా పొంచివున్నారు. వారు అతని సరుకు కాజేయకముందే మనం జాగ్రత్తపడాలి. అవసరమైతే అతనికి నా కూతురినిచ్చి పెళ్ళిచేసి అతని ఆస్తి మన ఆస్తిలో కలిపేస్తాను!" అన్నాడు.

"మీరు దురాశకు చిక్కి మోసపోకండి, ప్రభూ. ఈ మనిషి పట్టి మోసగాడు!" అన్నాడు వజీరు.

"నేను ముందుగా అతన్ని పరీక్ష చేస్తాను. అందుకు అవసరమైన ఆలోచన చేసే ఉంచాను. అతను మోసకాడని రుజువైతే తల తీసేయిద్దాం!" అన్నాడు సుల్తాను.

వెంటనే వజీరు మారుఫ్‌ను పిలిపించాడు. అతను వచ్చి సుల్తానుకు సలాంచేసి కూర్చున్నాడు.

"నువ్వు ఈ నగరపు వర్తకులకు అరవై వేల దీనారాలు బాకీ పడ్డావుట, నిజమేనా?"



అని సుల్తాను అడిగాడు. మారుఫ్ నిజ
నన్నాడు. "అయితే వారి బాకీ ఎందు
చెల్లించవు?" అని సుల్తాను మళ్ళీ అత
అడిగాడు.

"నా బిడారు వచ్చి దిగగానే వా
బాకీ చెల్లివేస్తాను. బంగారం కావాలం
బంగారం ఇస్తాను, సరుకు కావాలం
సరుకిస్తాను. ఏది కావాలంటే అది నాదగ్గ
కొల్లలు కొల్లలుగా ఉంది," అన్నా
మారుఫ్ తాపీగా.

అతన్ని పరీక్షింతామని సుల్తాను వెయ
దీనారాల విలువగల ముత్యాన్ని తీసి అత
కిస్తూ, "ఇలాటి విలువగల ముత్యాలు

బిడారువెంట ఉన్నాయా?" అని అడిగాడు. మారుఫ్ దాన్ని అటూ ఇటూ తిప్పిచూసి చివరకు ఆ ముత్యాన్ని కాలికింద పెట్టి తొక్కి చితకగొట్టేశాడు.

సుల్తాను మండిపడుతూ, "ఏమిటి నీ ఉద్దేశం?" అన్నాడు.

"ఎంత విలవ ఉన్నా, ఈ ముత్యం వెయ్యి దీనారాలకన్న ఉండదు. నావద్ద అంతకన్న చాలా పెద్ద పెద్ద ముత్యాలున్నాయి," అన్నాడు మారుఫ్.

సుల్తానుకు దురాశ కట్టలు తెగిపోయింది. ఆయన నగరవర్తకులను పిలిపించి, "మీరు మీ సొమ్ముగురించి ఏమీ బెంగపడ నవసరంలేదు. బిడారు తప్పక వచ్చి చేరుతుంది. మీ బాకీలు మీరు వసూలు చేసుకోగలుగుతారు," అని చెప్పాడు.

తరవాత ఆయన తన వజీరును పిలిచి, "మారుఫ్‌ను రాజభవనానికి అతిథిగా ఆహ్వానించు. అతనితో నా కుమార్తెను గురించి ప్రస్తావించి, పెళ్ళాడటానికి ఇష్టపడతాడేమో తెలుసుకో. అతని ఆస్తంతా మనం కలుపుకోవచ్చు!" అన్నాడు.

"ప్రభూ, ఈ విదేశీయుణ్ణి చూస్తే నాకు చాలా సందేహంగా ఉంది. అతన్ని రాజభవనంలో అడుగు పెట్టనివ్వటం మంచిది కాదు. ఇంతలో తొందర



ఏమొచ్చింది? అతని బిడారు వస్తున్న జాడ అయినా తెలిసేదాకా తొందరపడకండి!" అని వజీరు సలహా ఇచ్చాడు.

ఈ సలహా విని సుల్తాను మండిపడ్డాడు. "విశ్వాస ఘాతకుడా, నా కుమార్తెను నువ్వు పెళ్లాడతానని వెనక అన్నావు, దానికి మేం ఒప్పులేదు. ఇప్పుడు ఆమెకు మంచి సంబంధం వస్తే అది ఎలాగైనా పడగొట్టాలని చూస్తున్నావు. నాకుమార్తెకు ఎలాగైనా పెళ్లి యీడు తప్పించి అప్పుడు నీవే పెళ్ళాడా లనుకుంటున్నావు. ఇతను నా కుమార్తెను పెళ్ళాడితే మన మంతా బాగుపడిపోతాం, ఏమనుకుంటున్నావే?" అన్నాడాయన.

ఇంక ఎదురు చెబితే సుల్తానుకు మరింత కోపం వస్తుందనుకుని, వజీరు తిన్నగా మారుఫ్‌వద్దకు వెళ్లి, "సుల్తానుగారికి తమ కుమార్తెను మీకిచ్చి చేయాలని ఉన్నది. మీ ఉద్దేశం ఎలా ఉందని ఆయనతో చెప్పాలి?" అని అడిగాడు.

"సుల్తానుగారి ఆదరానికి చాలా కృతజ్ఞుణ్ణి. కాని నా బిడారు వచ్చేదాకా ఆగటం మంచిదికాదా? రాజకుమార్తెను పెళ్లాడట మంటే దానికి చాలా పెద్ద తతంగం ఉంది. పెళ్లికూతురికి కనీసం అయిదువేల సంచుల బంగారం పెట్టాలి. పెళ్లినాడు నగరంలోని పేదసాదలకు కనీసం వెయ్యి సంచుల





బంగారం దానం చెయ్యాలి. సైనికుల వినోదానికి మరో వెయ్యి సంచుల బంగారం అవసరం. పెళ్లికూతురికి నేను నూరు రత్నాలైనా పెట్టుకోవాలి. దాసదాసీ జనానికంతకూ కలిపి మరో నూరు రత్నాలు బహూకరించాలి. నా బిడారు చేరనిదే ఇదంతా ఎలా సాధ్యం అవుతుంది?" అన్నాడు మారుఫ్ దర్పంగా.

వజీరు ఈ మాటలను సుల్తానుగారికి నివేదించాడు.

సుల్తానుకు తల తిరిగిపోయినంత పని అయింది. ఆయన మారుఫ్‌ను వెంటనే పిలిపించి, "ఓ వర్తకశేఖరా, ఈ పెళ్లి వెంటనే జరిగిపోవాలి. పెళ్లికయే ఖర్చంతా నేనే భరించుకుంటాను. నా ఖజానానిండా పుష్కలంగా డబ్బున్నది. నీ అవసరాలకు కావలసింది ఎంతయినా నువ్వు నిరభ్యంతరంగా తీసుకోవచ్చు. పెళ్లికూతురు కివ్వదలచిన కట్నకానుకల సంగతి బిడారు వచ్చినాక చూసుకోవచ్చు. ముహూర్తం వాయిదా వెయ్యటంమటుకు నాకెంత మాత్రమూ ఇష్టంలేదు," అన్నాడు.

మారుఫ్ సరేనన్నాడు. అతనికి సుల్తాను కుమార్తెనిచ్చి వైభవంగా పెళ్లి చేసేటందుకు ఏర్పాట్లు జరిగాయి.

మారుఫ్‌ను పెళ్లికొడుకును చేసి దివిడిలో ఒక సింహాసనంమీద కూచోబెట్టారు. అతని ముందు గాయకులు పాడారు, నర్తకులు నాట్యం చేశారు, విదూషకులు హాస్యాలు చేశారు, గొప్పగొప్ప మల్లులు కుస్తీలుపట్టారు.

ఆ రోజల్లా అతను ఖజానానుంచి సంచులతో బంగారం తెప్పించి పంచుతూనే ఉన్నాడు. ఖజానానుంచి సంచులు తెచ్చి అందించలేక వజీరు రెక్కలు పడిపోయాయి. ఆయన మారుఫ్‌వద్దకి వచ్చి అతని చెవిలో, "అల్లా నిన్ను క్షమించడు! నగరవర్తకుల బంగారమంతా ఆలాములు పలాములు చేసింది చాలక సుల్తానుగారి

ఖజానా అంతా యీవిధంగా గుల్లచేస్తున్నావా?" అన్నాడు కోపంగా.

"మధ్య నీ సొమ్మేం పోయింది? నా బీడారు రానీ, సుల్తానుగారి సొమ్ముకు వెయ్యింతలు తిరిగి ఇస్తాను," అన్నాడు మారుఫ్.

నలభై రోజులపాటు ఉత్సవాలు జరిగాక పెళ్ళిరోజు వచ్చింది. పెళ్ళి ఊరేగింపులో మారుఫ్ బంగారం రెండుచేతులా వీధు లంతటా విదజల్లాడు.

చివరకు పెళ్లికొడుకునూ, పెళ్ళికూతురునీ పడకటింట్లోకి పంపారు. మారుఫ్ మంచానికి ఓమూల దిగాలుపడి కూచుని కంట నీరు పెట్టుకోసాగాడు.

సుల్తానుగారి కుమార్తె అతనిదగ్గిరికి వచ్చి, "ఎందుకలా విచారిస్తున్నారు? మీకేం కష్టంవచ్చింది?" అన్నది.

"అంతా అల్లా నిర్దేశం! కాని ఇలా జరగటానికి తప్పు పూర్తిగా మీ నాన్నదే!" అన్నాడు మారుఫ్.

"ఇప్పుడేం తప్పు జరిగింది?" అన్నది సుల్తానుకుమార్తె.

"జరగక పోవటమేం? నన్ను చూసి అందరూ తిడుతున్నారు. నా బీడారు వచ్చినదాకా ఈ పెళ్లి జరపకుండా ఆపి



నట్టయితే నీకు ఎటువంటి బట్టలు పెట్టేవాణ్ణి, ఎటువంటి నగలు పెట్టేవాణ్ణి! ఇంత వైభవంగా పెళ్లిచేసుకునికూడా, పెళ్లికూతురివైన నీకు ఏమీ పెట్టక లోకానికి పరమ నీచుణ్ణిగా కనిపిస్తున్నాను!" అన్నాడు మారుఫ్ విచారంగా.

"దీనికే ఇంత విచారించాలా?" అన్నది సుల్తానుకుమార్తె.

పెళ్లి అయిన మర్నాడు సుల్తానుగారి నౌకర్లకు, వడ్డించే కుర్రాడు మొదలుకొని వజీరు దాకా ప్రతి ఒక్కరికీ మారుఫ్ బట్టలు పెట్టి బంగారం బహూకరించాడు. ఈ దాన ధర్మాలు ఇరవై రోజులపాటు సాగాయి.

ఆ తరవాత సుల్తానుగారి ఖజానా ఖాళీ అయిపోయింది. అంతవరకు మారుఫ్ బిడారు జాడలేదు.

వజీరు సుల్తానుతో, "మహాప్రభూ, ఖజానా ఖాళీ అయింది. అల్లుడుగారి బిడారు వచ్చే సూచనలేవీ ఇంతవరకూ లేవు. ఏం చెయ్యాలి?" అన్నాడు.

సుల్తానుకు యీమాటలు వినగానే కంగారెత్తింది. "అవును, ఏం చేద్దాం?" అన్నాడాయన అదుర్దాగా.

"ఈ వంచకుణ్ణి నమ్మవద్దని ఆదివరకే చెప్పాను. నన్నడిగితే ఇతనికి బిడారే లేదంటాను. మిమ్మల్ని మోసగించి, చిల్లిగవ్వ కూడా కట్నం ఇవ్వకుండా మీ కుమార్తెను పెళ్ళాడి, పైపెచ్చు మీ ఖజానా గుల్ల చేశాడు! ఈ పనికిమాలినవాణ్ణి ఇంకెంత కాలం సహించి చూస్తూ ఊరుకోవటం? వెంటనే వీడికి తగిన ప్రాయశ్చిత్తం చేయించండి!" అన్నాడు వజీరు.

"అతన్నిగురించి నిజంతెలిస్తే ఎంత బాగుండును!" అన్నాడు సుల్తాను నిస్పృహతో నిట్టూర్చుతూ.

"మహాప్రభూ, భర్త రహస్యాలు భార్య వద్ద దాగవు. అతన్నిగురించి నిజం తెలుసుకునేటందుకు నన్నొక్కసారి మీ కుమార్తెతో మాట్లాడనిస్తారా?" అని అడిగాడు వజీరు.



సుల్తాను సమ్మతించాడు. ఒక తెర అడ్డం కట్టించినాక, సుల్తానుకుమార్తె వచ్చి తెర వెనక నిలబడింది. వజీరు ఇవతల నిలబడి, "అమ్మా, ఖజానా ఖాళీ అయింది. ఆ పుణ్యం కట్టుకున్నది మీ భర్తే. ఆయనకు ఒక బిడారున్నట్టు అస్తమానం వింటూనే ఉన్నాం. గాని ఆ బిడారును కళ్ళచూసిన వారెవరూ లేరు. ఈ మారుఫ్ అనే మనిషినిగురించి మీ కేమి తెలుసు? ఆయన నమ్మదగిన వాడేనా? ఈ విషయాలు దయచేసి చెప్పాలి. ప్రభువువారితో సంప్రతించి వారి అనుమతితోనే నేను మిమ్మల్ని ఈ విధంగా అడుగుతున్నాను," అన్నాడు.

"నాకు అంతులేని ముత్యాలూ, రత్నాలూ, ఆభరణాలూ ఇస్తానని ఆయన రోజూ నాతో అంటూ ఉంటాడు. నేను కూడా ఇంకా వాటిని కళ్ళ చూడలేదు," అన్నది సుల్తానుకుమార్తె.

"మహారాణీ, ఈ రహస్యం ఏమిటో మీ రివాళే అడిగి తెలుసుకోండి. ఆ రహస్యం ఎవరికీ చెప్పనని ఆయనకు మాట ఇవ్వండి!" అన్నాడు వజీరు.

"అలాగే చేస్తాను," అన్నది సుల్తాను కుమార్తె.

ఆమె ఆ రాత్రి మారుఫ్‌తో, "మీరు నాతోనైనా నిజం చెప్పి ఉండరాదా? మీకు



బిడారూ, సరుకూ ఏమీ లేదని మా నాన్నకు తెలిసిపోయింది. ఆయన మిమ్మల్ని కఠినంగా శిక్షిస్తాడు. అసలు మీ సంగతి ఏమిటో చెప్పెయ్యండి. వీలయితే మీకు సహాయపడుతాను," అన్నది.

మారుఫ్ ఏమీ దాచకుండా సుల్తానుకుమార్తెకు తన కథయావత్తూ చెప్పేశాడు. అంతా విని ఆమె విరగబడి నవ్వింది. "ఇంత పచ్చిమోసం నేనెన్నడూ వినలేదు. మీ రిక్కడ ఉంటే మానప్రాణాలు దక్కవు. వజీరూ, మా నాన్నా కలిసి మిమ్మల్ని హతమారుస్తారు. నా దగ్గిర యాభైవేల దీనారాలున్నాయి. అవి తీసుకుని ఇప్పుడే బయలుదేరి దూరదేశం వెళ్ళిపొండి. అక్కడికి చేరాక మనిషిద్వారా మీ క్షేమం నాకు తెలియజేయండి!" అన్నదామె.

మారుఫ్ ఆ డబ్బు తీసుకుని, బానిసలు వేసుకునే దుస్తులు వేసుకుని, సుల్తానుగారి అశ్వశాలలో ఉన్న గుర్రాలలోకెల్లా మేలుజాతి గుర్రం ఎక్కి ఆ రాత్రే కోట నుంచి పరారీ అయిపోయాడు.

మర్నాడు ఉదయం సుల్తానుగారూ, వజీరూ కలుసుకుని సుల్తానుకుమార్తెను పిలిపించారు. ఆమె తెర వెనక కూచున్న తరవాత సుల్తానుగారు, "అమ్మా, నీ భర్తను గురించి ఏం తెలుసుకున్నావు!" అన్నాడు.



"తప్పుడు మాటలు చెప్పినవాళ్ల నోళ్లు పడిపోతాయి!" అన్నది సుల్తానుకుమార్తె, ఎంతో కోపం నటిస్తూ.

"అదేమిటి ?" అన్నాడు సుల్తాను.

"నిన్న రాత్రి నా భర్తకు ఎవరో ఒక ఉత్తరం తెచ్చి ఇచ్చారు. ఆ ఉత్తరాన్ని నేనే తీసుకుని చదివాను. నా భర్త బిడారులో ఉండే అయిదువందలమంది జానిసలూ ఆ ఉత్తరం రాయించి పంపారు. రెండువేల మంది ఎడారి బందిపోటు దొంగలు గుర్రాలెక్కివచ్చి బిడారుమీద దాడి చేశారట. ఘోరంగా యుద్ధం జరిగిందట. ఎంతో మంది జానిసలూ, ఎన్నో కంచరగాడిదెలూ చావటం జరిగిందట. బిడారు వచ్చి చేరటం అందుకే ఆలస్యమయింది. డెబ్భైవేల దీనారాల సరుకు నష్టమయిందని తెలిసికూడా నా భర్త, అదేపాటి నష్టంలే అన్నారు. ఆయన అప్పటికప్పుడే గుర్రం ఎక్కి బయలుదేరి వెళ్లారు. స్వయంగా వెంటఉండి బిడారును మన నగరానికి తీసుకువస్తానన్నారు." అన్నది సుల్తాను కుమార్తె.

ఈ మాటలు విని సుల్తాను పరమానందం చెందాడు. ఆయన వజీరుకేసి తిరిగి, "ఇక ఎన్నడూ నాకిలాటి అబద్ధాలు చెప్పకు. తెలియకపోతే నోరు మూసుకుని ఉండకో !" అని మందలించాడు.





ఈ లోపుగా మారుఫ్ తన గుర్రంమీద ఎడారిమార్గం పట్టి వెళ్లాడు. అతని మనస్సు మాత్రం సుల్తానుకుమార్తెమీదే ఉంది. మధ్యాహ్నం అయేసరికి అతను ఒక గ్రామం సమీపానికి వచ్చాడు. అతనికి ఆకలి దహించుకు పోతున్నది.

సమీపంలో ఒక రైతు పొలందున్నుతూ, మారుఫ్‌ను చూసి, "దొరగారికి శుభం కలగాలి!" అన్నాడు. అతను మారుఫ్‌ను చూసి పెద్ద రాజోద్యోగి అయి ఉంటాడనుకున్నాడు.

మారుఫ్ గుర్రం దిగి, "నువ్వెవరు, బాబూ? ఆ కనిపించే గ్రామంలో భోజనశాల ఉన్నదా?" అని అడిగాడు.

"ఈ పొలం నాదే, బాబూ! మా గ్రామం చాలా చిన్నది. ఇక్కడ భోజనశాల లుండవు. అయినా మీ కెందుకువచ్చిన శ్రమ. మీరిక్కడే ఉండండి. నేనింటికి వెళ్లి తమకు భోజనం చేయించి పట్టుకొస్తాను. ఆ తరవాత మీ దారిన మీరు పోదురుగాని!" అన్నాడు రైతు.

ఎంతసేపు చూసినా రైతు తిరిగి రాలేదు. తన మూలంగా వాడి పొలంపని నిలిచి పోయినందుకు విచారించి, మారుఫ్ తానే పొలంలోకి వెళ్లి, కాడి పట్టి దున్న సాగాడు.

ఎద్దులు కొంతదూరం వెళ్లేసరికి నాగలికి ఏదో అడ్డం తగిలింది. ఎద్దులు ఎంత బలంగా లాగినా అది ముందుకు పోలేదు.

ఆ అడ్డం తగిలిన దేమిటో చూద్దామని మారుఫ్ పలుగుతో తవ్వి చూసేసరికి ఒక రాతిపలక కనిపించింది. అతను దాన్ని చూసి ఆశ్చర్యపడుతూ, తన బలమంతా వినియోగించి రాతిని పక్కకు తీశాడు. రాతి కింద ఒక నేలమాళిగా, అందులోకి దిగే మెట్లూ కనిపించాయి.

మారుఫ్ మెట్లు దిగి వెళ్లాడు. అడుగున ఒక నలుచదరమైన పెద్ద కొట్టం ఉన్నది. అందులో నాలుగు గదులున్నాయి. వాటిలో బంగారపు కుప్పలూ, ముత్యాల కుప్పలూ, రత్నాల కుప్పలూ ఉన్నాయి. ఎన్నో వందల



సంవత్సరాలక్రితం ఎవరో రాజులు తమ ధనాన్ని ఆ కొట్టంలో దాచుకున్నారు. తర వాత ఆ రాజ్యం పోయింది. ఆ ప్రాంతాన్ని ఎడారి ఆక్రమించింది.

మారుఫ్ తన అదృష్టాన్ని నమ్మలేక పోయాడు. అతను మళ్ళీ పైకివచ్చి, రాతిని యథాస్థానంలో పెట్టేసి, దానిపై మన్నుకప్పి, రైతుకోసం ఎదురుచూడసాగాడు.

కొద్దిసేపట్లోనే రైతు రకరకాల ఆహార పదార్థాలను తెచ్చి మారుఫ్‌ముందు పెట్టి, "బాబూ, తమకోసం ప్రత్యేకంగా వంట చేయించే సరికి ఆలస్యమయింది, మన్నించండి!" అన్నాడు.

"ఏమోయ్, నువ్వు చాలా మంచివాడివి లాగా, తెలివిగలవాడివిలాగా కనబడు తున్నావు. నాదగ్గిర యాభైవేల దీనార ఉన్నాయి. వాటిని తీసుకుని ఈ పొలం నాకు వదిలెయ్యి. ఆ డబ్బుతో హాయిగా వర్తకం చేసుకో. పొలం చేసుకుంటే నీకేం వస్తుంది?" అన్నాడు.

రైతు ఆనందానికి మేరలేదు. మారుఫ్ అతనికి తనకు సుల్తానుకుమార్తె ఇచ్చిన డబ్బంతా ఇచ్చేసి పొలం తనపేర పెట్టించు కున్నాడు. తరవాత అతను ఆ రైతు ఇంటనే కొంతకాలం ఉండి, దొరికిన కంచరగాడిద లల్లా కొనసాగాడు. చిన్నచిన్న బిడార్లు ఆ ప్రాంతంగా వస్తే వాటిని, వాటివెంట ఉన్న బానిసలతో సహా కొనసాగాడు.

ఒక నెలలోపల అతను అయిదువందల కంచరగాడిదలనూ, అయిదువందల బానిస లనూ కొన్నాడు. పొలంలో తనకు దొరికిన రత్నరాసులన్నిటినీ ఆ కంచరగాడిదల మీదికి ఎత్తించి, తిరిగి ఖతాన్ నగరానికి బయలుదేరాడు.

ఈలోపల ఆ నగరంలో సుల్తానుగారు చాలా ఆందోళన చెంది ఉన్నాడు. ఖజానా ఖాళీ అయి నెల రోజులయింది. తన భర్త బిడారును తీసుకురావటానికి వెళ్ళాడని

సుల్తానుకుమార్తె చెప్పింది. అతను తిరిగి వస్తాడనీ ధనం తెస్తాడనీ సుల్తాను ఏరోజు కారోజు ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు.



ఆఖరుకు వజీరు, "మహాప్రభూ, మీ కుమార్తె చెప్పిన అబద్ధాలు నమ్మి మీరు నిష్కారణంగా భ్రమలో పడిపోతున్నారు. మీ అల్లుడుగారు వెళ్ళినది బిడారును తెచ్చేటందుకు కాదు, తన ప్రాణం దక్కించుకునేటందుకు! అతనికి బిడారెక్కడిది?" అన్నాడు ఈసడింపుగా.

సరిగా ఆ సమయానికే భటుడొకడు పరిగెత్తుకుంటూ వచ్చి, సుల్తానుగారికి సలాము చేసి, "మహాప్రభూ, అల్లుడుగారు తిరిగి వస్తున్నారు!" అన్నాడు.

సుల్తాను ముఖం విచ్చుకున్నది, వజీరు ముఖం ముడుచుకున్నది. మారుఫ్ వచ్చి సుల్తానును కౌగలించుకుని, "నే ననుకున్న దానికన్న చాలా ఎక్కువ నష్టమే జరిగింది. నా సొత్తులో కొద్దిభాగమే దక్కింది. చూతురు గాని రండి!" అంటూ సుల్తానును తన వెంట తీసుకువెళ్లాడు.

రాజభవనం ముందు ఆవరణలో మూటలన్నీ దించి ఉన్నాయి. వాటిని తెచ్చిన కంచరగాడిదలు ఒక పక్కగా నిలబడి ఉన్నాయి. ధనరాసులను చూడవచ్చిన నగరంలోని వేలాది జనాన్ని భటులు దూరంగా ఉంచారు.

మారుఫ్ తెచ్చిన రత్నరాసులు చూడగానే సుల్తానుగారికి కళ్ళు చెదిరిపోయాయి. కొన్ని మూటలనిండా అచ్చగా వజ్రాలు, కొన్నిటిలో అచ్చగా వైడూర్యాలు, కొన్నిటిలో మరకతాలు, కొన్నిటిలో పుష్యరాగాలు, కొన్ని సంచులనిండా పోకకాయలంతేసి పెద్ద పెద్ద ముత్యాలు వున్నాయి!

"ఇదంతా నీ సరుకే?" అన్నాడు సుల్తాను ఆశ్చర్యంగా.

"దొంగలు నా బిడారుమీద దాడిచేశారు గదా! అందువల్ల ఇంకా ఇంత సరుకు

పోయింది. పోయింది పోగా మిగిలినదంతా మనసొత్తే!" అన్నాడు మారుఫ్.

సుల్తాను తన వజీరుకేసి తిరిగి, "ఇప్పుడేమంటావు?" అన్నాడు.

"మహాప్రభూ, ఇదంతా చూసి మోసపోకండి. ఇందులో ఏదో మోసం ఉండే ఉంటుంది!" అన్నాడు వజీరు.

"ఈ నీచుణ్ణి తీసుకుపోయి ఉరి తీయించండి!" అన్నాడు సుల్తాను తన భటులతో. వెంటనే వాళ్ళు వజీరును పెడరెక్కలు విరిచికట్టి లాక్కుపోయారు.

అప్పటికప్పుడే సుల్తాను మారుఫ్‌ను తన వజీరుగానూ, తన తరవాత సుల్తానుగానూ ప్రకటించాడు.

మారుఫ్ బిడారు వచ్చి చేరినందుకు పెద్ద విందు జరిగింది. ఆ విందుకు నగరంలో ఉండే వర్తకులందరూ వచ్చారు. వారిలో అలీకూడా ఉన్నాడు. మారుఫ్ అందరి బాకీలూ రెట్టింపుగా చెల్లించాడు.

"తమరి డబ్బు ఎక్కడికీ పోదని మాకు తెలుసు. కాని మేము చిన్న వర్తకులం గనక ఎంతోకాలం ఆగలేక పోయాం!" అన్నారు వర్తకులు.

అలీ ముఖానసమటుకు కత్తివాటు వేస్తే నెత్తురుచుక్క లేదు. మారుఫ్ ఈ బిడారూ, ఇంత ధనమూ ఎక్కడనుంచి తెచ్చాడో అలీకి తెలియనే లేదు.

అదేవిధంగా సుల్తానుకుమార్తెకూడా ఆశ్చర్యపడింది. "ఈ సొత్తంతా ఎక్కడిది? నా ప్రేమ పరీక్షించటానికి అబద్ధమాడావా?" అన్నదామె తన భర్తతో.

మారుఫ్ ఆమెతో నిజం చెప్పేశాడు. ఆ తరవాత వారు చాలాకాలంపాటు సుఖంగా బతికి అనేకమంది పిల్లలను కన్నారు.

కొన్నేళ్ళ తరవాత మారుఫ్ మామగారు చనిపోయాడు. ఆ నాటినుంచీ మారుఫ్ ఖాతాన్ నగరానికి సుల్తానై చాలా ఏళ్ళు ధర్మంగా రాజ్యపాలన చేశాడు.

